




దారిలో పెద్ద గాలి తుఫాను వచ్చింది. ఆ హడా-వుడిలో మా ఓడ నీళ్ళ మధ్యనున్న రాతికి



నేను ఇంకొక అయిదుగురితో కలిసి ఓ పడవలో దూకాను. శక్తినంతా ఉపయోగించి తెడ్లని






మా ఓడ చాలా వేగం మునిగిపోయింది. చాలామంది మునిగిపోయారుకూడా.

అరగంట తరవాత మాకు మూడు మైళ్ల దూరంలో తీరం కనబడింది.





మేమందరం బాగా అలిసిపోయాం. పెద్ద కెరటం వచ్చి మా పడవని తల్లకిందులు చేసింది.

నా తోటివారు మునిగిపోయారు. అదృష్టవశాత్తూ నేను చుక్కాని కర్ర పట్టుకున్నాను.





కొంతసేపు తరవాత కాళ్ళకి నేల తగిలింది.

ఒడ్డు చేరి ఓ అరమైలు నడిచానుగాని మనుష్య





బాగా అలసిపోయి వున్నానేమో కళ్లుమూసుకు పోసాగాయి. అక్కడే గడ్డి మీద నిద్దరపోయ్యాను.

కళ్ళు తెరిచేప్పటికి బాగా తెల్లవారింది. లేవ్వాలని ప్రయత్నిస్తే కదల్లేకపోయాను.



చుట్టూరా సన్నటి గొంతుకలు పెద్దిగా వినిపిస్తున్నాయి. కళ్లు అటూ ఇటూ తిప్పిచూద్దునుగదా, చేతులూ కాళ్ళూ సన్నటి తాళ్ళతో కట్టేసివున్నాయి. పొడుగాటి నా జుట్టుకూడా అలాగే కట్టేసివున్నది.






అరంగుళాల ఎత్తున్న మనిషి కత్తితో నా

అతని వెనకాల అలాటివాళ్ళే మరికొందరు



వెంటనే తాళ్లు తెంపుకునే ఉద్రేకంతో అటూ ఇటూ గింజుకున్నాను. ఎడం చేతిని వున్న తాళ్లు దారాలవుతూ పట్ మని తెగాయి. ఎడంవైపు జుట్టుని కట్టేసిన తాళ్లుకూడా కొన్ని వదులయ్యాయి.



"టోల్గో ఫొనాక్" అనేకేకలు వినబడ్డాయి. చిన్న చిన్న బాణాలు మొహానికి గుచ్చుకున్నాయి.



అరుగున్నర ఎత్తు మంచెమీద ఒకాయన ఎక్కి ఉపన్యాసం ఇచ్చారు.



నాకు ఆకలి వేస్తోందని ఆతడికి సంజ్ఞలు చేశాను.



బోలెడుమంది బుల్లి బుల్లి మనుషులు ఆహారం





పీపాలకొద్దీ పానీయం, బళ్ళకొద్దీ వండిన మాంసం నాకు దగ్గరగా తీసుకొచ్చారు.

బండెడు మాంసం నాకు పంటికిందికి కూడా రాలేదు. చాలా బళ్ళ మాంసం చప్పరించేశాను.





లొడితెడున్న పీపాల్లోని పానీయం నాలికకూడా తడపలేక పోయింది. తాగగానే మైకం కలిగి, నిద్ర కమ్ముకువచ్చింది.

చేతిమీద గుచ్చుకొన్న బాణాలను నేను మైకంలో వుండగా తీసివేసి తైలం పూశారట. నన్ను కట్టేసిన తాళ్ళన్నీ తెంపివేశారు.



ఇంజనీర్లు వడ్రంగులు అయిదువందలమంది కలసి 84 అంగుళాల పొడుగు, 48 అంగుళాల వెడల్పు, వుండి 22 చక్రాలు అమర్చిన బల్లకట్టు రథం నిర్మించారు. గడలు నాటి కొక్కేలకు తాళ్ళుపోసి వాటితో నా శరీరాన్ని ఆ రథం మీదికి దొర్లించారు.





4½ అంగుళాల ఎత్తున బలిష్ఠంగా వున్న 1500 వారి గుర్రాలను రథానికి పూన్చి, 2640 అడుగుల దూరానున్న నగరానికి బయలుదేరారు.

ఒక మజిలీలో చిన్న తమాషా జరిగింది— ముగ్గురు కొంటెవాళ్ళు నా మొహంమీద కెక్కి నా ముక్కులో బల్లెం తిప్పారు.



నాకు హఠాత్తుగా మెలకువ వచ్చి ఒక్క పెట్టున తుమ్మేసరికి ఆ ధాటకు ఆ ముగ్గురూ ఎగిరి దూరంగా పడ్డారు.





ఊరి చివారున వున్న పాడుబడ్డ గుడి దగ్గర రథం ఆగింది. రాజ్యం అంతటికీ పెద్దదైన ఆ భవనం 8 అడుగుల ఎత్తుంది. నేను లేచి నిలబడి బద్ధకంగా ఒళ్ళు విరుచుకునేసరికి తొలిసారి నా పూర్తి విగ్రహాన్ని చూచిన లిల్లిపుట్ ప్రజలు భయంతో కకావికలై పరిగెత్తారు. చుట్టూ కలయచూడగా రాజ్యమంతా చిన్న బొమ్మలకొలువులా కనిపించింది.





నా ఎడంకాలికి నన్నూరి గొలుసులు చుట్టి గుడి గుమ్మానికి కట్టేశారు. రెండు గజాలమేర నడయాడానికి మాత్రమే వీలుంచారు.

నన్ను చూడ్డానికి అప్పుడే కొన్నిలక్షలమంది ప్రజ పోగడ్డారు. ఈలోగా చక్రవర్తిగారే స్వయంగా విచ్చేశారు.



నేను వినయంగా అభివాదం చేశాను. ఆయన సంతోషించారు. నాకు ఎవరైనా హానిచేస్తే కఠినంగా దండిస్తామని ప్రజను హెచ్చరించారు. నా అన్నపానాలకూ నివసకూ వసతులు చేయించి వెళ్ళిపోయారు. లిల్లిపుట్ భాష నేర్పేందుకు గురువులనుకూడా నియమించారు.





కొన్నాళ్లతరువాత రాజభటులిద్దరువచ్చారు. నా జేబులన్నీ తనిఖీ చెయ్యాలన్నారు.

అందుకు సమ్మతించి వారిని జాగ్రత్తగా నా చేతిలోకి ఎక్కించుకుని ఒక్కొక్క జేబులో దించాను. వారి నివేదిక ఇలా వుంది—



"పర్వతకాయుడి కోటు కుడిజేబులో ఒక ముతకగుడ్డ వుంది. దాని వైశాల్యం ఒక ఎకరం వుంటుంది.



"ఎడమవైపు జేబులో ఒక పెద్ద వెండి భోషాణం వుంది. చాలా కష్టంమీద దాని మూత తెరిచి లోనికి చూశాము.



"అందులో మోకాలు లోతున ఎర్రటి పొడుం వుంది. పొర్లిన ఆ దుమ్ము మా ముక్కుల్లోకి రాగా తుమ్ములతో ఉక్కిరిబిక్కిరయాము.



"పక్క జేబుల్లో రెండు పొడుగాటి యంత్రాలున్నాయి. చెక్క, ఉక్కు కలిసివున్న వాటితో అతనేమి చేస్తాడో మాకు తెలీలేదు.



"అతని వాతివద్ద వున్న జేబులోనుండి చెవులు పగిలిపోయేట్లు 'టిక్ టాక్' అన్న ధ్వని వినబడింది. అది బయటికి తీసి చూశాము.



"ఆ మహాయంత్రంపై రెండు పెద్ద బద్దీలు తిరుగుతున్నాయి. దాన్ని చూడందే అతడు ఏ పని చెయ్యడుట."




"ఆ మహాయంత్రంపక్క నిలవడమే కష్టమయి పోయింది. పర్వతకాయుడి కోటు జేబుల్లో మరి కొన్ని వస్తువులున్నాయి."



"అవి: పెద్ద మడతకత్తి ఒకటి, రథచక్రాలంతటి బంగారపు నాణాలూ, నల్లటి పెద్ద 'గోళాలు.' (ఆ గోళాలు నా పిస్తోలుగుళ్ళు).



చక్రవర్తిగారు ఆ నివేదిక చదువుకోగానే వెంటనే బయలుదేరి వచ్చారు. ఉక్కుతో చేసిన పొడుగాటి గొట్టంలాటి యంత్రం చూపమన్నారు.



ఆయన చెప్పినట్టే నా పిస్తోలు— తీసి గాలిలోకి పేల్చాను. ఆ ధ్వనికి రాజుగారి పరివారమంతా కకావికలై పరిగెత్తింది.



తరవాత చక్రవర్తి గారి ఆజ్ఞ ననుసరించి నా గడియారం, బాకు, పిస్తోలు ఒక బండిమీద వేసి తీసుకువెళ్ళిపోయారు.



అదృష్టవశాత్తు వారి కంటబడని నా కళ్ళజోడు నావద్దనే ఉండిపోయింది. దానిని తీసుకుని పదిలపరచుకున్నాను.





తరువాత ఒక రాజ్యప్రతినిధి వచ్చాడు. నా సంకెళ్ళు తొలగించడానికి రాజాజ్ఞ అయిందని చెప్పి అందుకు కొన్ని షరతులు వినిపించాడు.

సంకెళ్ళు తీస్తున్నందుకు సంతోషం కలిగినా నేను పూర్తిగా ఎరగని ఒక రాజ్యానికి హాని చెయ్యమనడం నాకు ఏమాత్రమూ నచ్చలేదు.






కానీ అంతటి మహాచక్రవర్తి మాట కాదనడానికి నే నెంతవాణ్ణి? నా ఇష్టాయిష్టాలతో నిమిత్త మేమిటి? ఎదురాడకుండా ప్రమాణం చేశాను.

నా మకుటం ఎత్తున ఉన్న మహావృక్షాలను తప్పించుకుంటూ రాజధాని మిల్డెండో నగరాన్ని చూడడానికి బయలుదేరాను.



నా రాకకి రెండుగంటలు ముందుగా నగరాన్ని హెచ్చరించారు. వీధులన్నీ ఖాళీ అయిపోయాయి. ప్రజలు మేడల కిటికీల్లోంచి, తలుపు సందులనుంచి చూస్తున్నారు. అయిదడుగుల వెడల్పున్న రాజ బాటలో జాగ్రత్తగా కాలు మోపాను. రాజభవనంవైపు దారితీశాను.


నగరం మధ్యన రాజభవనం అత్యంత సుందరంగా కనబడింది. అందంగా పెంచిన పచ్చటి ఉద్యాన
వనాలు, తళతళ మెరుస్తున్న అయిదడుగుల ఎత్తు చలవరాతి భవనాలు, ఎంతో ముచ్చట గొలిపాయి.
కోటమధ్యన నలభై చదరపు అడుగుల ఖాళీస్థలం వుంది.
రెండడుగుల ఎత్తు వున్న కోట గోడను అతి
జాగ్రత్తగా దాటాను, ఏ మాత్రం నేలమట్టమవు
తుందో అని భయపడుతూ—
ఆ ఖాళీస్థలంలో ఓరిగిలా మేను వాల్చి,
కిటికీలూ, ద్వారాలూ తెరిచివున్న భవనంలోనికి
తొంగి చూశాను.
కాబట్టి నువ్వు వెంటనే
బ్లెఫుస్కూ రాజ్యం పైకి
దండెత్తి పోవలెను.
అతి వైభవంగా వున్న చక్రవర్తి అంతఃపురం పట్టు
తెరలతో, మణి సింహాసనాలతో వెలిగిపోతోంది.
రాణీగారూ, చక్రవర్తీ, ఆయన పరివారమూ
కొలువుతీర్చి వున్నారు.
ఇంతలో మంత్రిగారు కిటికీవద్దకు వచ్చి, లిల్లి
పుట్ శత్రువులైన బ్లెఫుస్కూ రాజ్యంవారు
దండయాత్రకి బయలుదేరుతున్నారనీ, మేము
వారి నెదుర్కోవాలనీ తెలిపారు.





సముద్రతీరానికి వెళ్లగా దూరాన బ్లెఫుస్కూ రాజ్యపు తీరం కనబడింది. వారి ఓడల తెర చాప కొయ్యలు స్పష్టంగా కనబడ్డాయి.

రెండు రాజ్యాలకీ మధ్యనున్న సముద్రం అట్టే లోతు లేదు. నెమ్మదిగా నడుస్తూనే అరగంటలో అవలి ఒడ్డు సమీపించాను.



శత్రువులకు కనబడకుండా పొంచిపొంచి ముందుకు సాగి, రేవు సమీపించి—





ఒక్కసారిగా పైకి లేచి పెద్ద కేక వేశాను. అది వారి పాలిట ఉరుములా వినిపించింది, నా పర్వతాకారం భయంకరంగా కనిపించింది, హడలగొట్టింది. అక్కడున్న యుద్ధ నావలలోని సైనికులు దాదాపంది నీళ్ళలో దూకి, ఒడ్డుకు ఈది, చెల్లాచెదరై పరిగెత్తారు.

# గలివర్ యాత్రలు





బ్లెఫుస్కు యుద్ధనావలలోని సైనికులు ఆ భయంనుంచి కోలుకునే లోపల నేను రేవులో ఓడల లంగర్లు తీసేశాను.

అంతలోనే వందలకొద్దీ బాణాలు వర్షపు జల్లులాగా వచ్చి పడ్డాయి. చిన్నవే అయినా చాలా బాధ కలిగించాయి.





బ్లెఫుస్కు సైనికులు ప్రయోగించే ఆ బాణాల వల్ల కళ్ళకు హాని కలగకుండా వుండేందుకు జేబులోని కళ్ళజోడు తీసి పెట్టుకున్నాను.

అక్కడున్న వాటిలో చాలా పెద్దవైన యాభై యుద్ధనౌకల పగ్గాలు గుదిగుచ్చి పట్టుకుని లిల్లిపుట్ రాజ్యంవైపు సాగిపోయాను.



లిల్లిపుట్‌తీరం సమీపించేముందు కళ్ళజోడు తీసి జేబులో పెట్టేసుకున్నాను. నేను ఒడ్డు చేరేసరికి చక్రవర్తి, ఆయన పరివారం, ప్రజలు వేలాదిగా అక్కడ నిలిచి ఎదురు చూస్తున్నారు. "లిల్లిపుట్


చక్రవర్తి నా రాజభక్తిని అనేకవిధాల మెచ్చుకున్నారు. దేశమంతటికీ గొప్పదైన 'నార్థాక్' అన్న బిరుదాన్ని ప్రసాదించి సత్కరించారు.
ఏలువెంబట క్లైవుమ్మాలో మిగిలి వున్న ఓడలన్నిటినీ కూడా లాక్కొచ్చెయ్యమని చక్రవర్తి అన్నారు. రాజ్యకాంక్షకి అంతూ దరుకదా!
క్లైవుమ్మను సామంతరాజ్యం చేసుకోవాలని దురాశపడ్డారు రాజా. ప్రజలను బానిసలను చేయడం మతరామూ నాకిష్టంలేదని చెప్పేశాను.
మంత్రివర్గంలోని కొందరు పెద్దలు కూడా నా మాట మన్నించి ఆ ఉద్దేశం తగదని చక్రవర్తికి నచ్చచెప్పారు.
రాజాగారు నొచ్చుకున్నట్టు కనబడ్డారు. కానీ ఏమీ అనకుండా అక్కడనుంచి గంభీరంగా లేచి వెళ్ళిపోయారు.



మూడువారాల తరువాత బ్లెఫుస్క్యు దేశం నుంచి ఒక పెద్ద రాయబారవర్గం వచ్చింది. లిల్లిపుట్ చక్రవర్తి స్నేహం కోరి వారు సంధికి వచ్చారు. అన్నివిధాలా తనకు అనుకూలమైన షరతులతో చక్రవర్తి సంధి పత్రాలు రాయించాడు.



తరువాత ఆ రాయబారులు నన్ను చూడడానికి వచ్చారు. నన్నూ, నా శక్తి సామర్థ్యాలనూ వేనోళ్ళ మెచ్చుకున్నారు.



"మీరు మా రాజ్యానికి ఒకమారు దయచేయవలసింద"ని తమ చక్రవర్తి మాటగా నన్ను ఆహ్వానించారు. నేను అంగీకరించాను.



ఆ తరవాత ఒక రోజున చక్రవర్తిగారి దర్శనం సంపాదించి బ్లెఫుస్క్యు రాజు ఆహ్వానం మన్నించి వెళ్ళడానికి అనుమతి కోరాను. చక్రవర్తిగారు ముభావంగా వుండి తుదకు సరే అన్నారు. ఆయనకి నావల్ల



ఇలా వుండగా, ఒకనాటి అర్ధరాత్రివేళ నా స్నేహితుడైన రాజోద్యోగి ఒకాయన రహస్యంగా నా వద్దకు వచ్చాడు.

నాకు ఒక పెద్ద అపద వాటిల్లబోతోందని హెచ్చరించాడు. "అసలే మీపట్ల విముఖులైవున్న చక్రవర్తికి, మీరంటే గిట్టనివాళ్ళు లేనిపోనివి కల్పించి చెప్పారు. బ్లెఫుస్కూ రాయబారులతో మాట్లాడ్డమే నేరమని, పైగా ఆ దేశం వెళతాననడం రాజద్రోహమేనని చెప్పారు. మిమ్మల్ని వెంటనే వధించాలని తీర్మానించారు. కాని రాజుగారు మీమీద దయతలచి మీరు చేసిన సహాయం తలచి కళ్ళుమాత్రం తీయించి వేయాలని నిశ్చయించారు. ఏ క్షణంలోనైనా అపద వాటిల్లవచ్చు.





"నేను చెప్పదలచుకున్నది చెప్పాను. చెయ్యగలిగిందేమీ లేదు. కర్తవ్యం మీరే ఆలోచించు

తెల్లవారేసరికి నా బట్టలన్నీ ఒక పెద్ద ఓడలో వేసి. నేను బ్లెఫుస్కూ వెళుతున్నట్లు చక్ర






నాకు ఊరి చివార్న చెట్టుకింద వసతి ఏర్పాటు
చేశారు. కోరిన పదార్థాలూ, పానీయం ఎక్కువే
వాళ్ళే తెచ్చి ఇచ్చారు.



ఒకరోజున సముద్రపు ఒడ్డు దగ్గరికి షికారుగా
వెళ్ళాను. దూరంగా ఒక పెద్ద పడవ కనబడింది.
అది అక్కడివాళ్ళ పడవ కాదు, నిజంది.



బ్లెఫుస్కూ రాజ్యం చేరగానే రాజుగారు తమ పరి
వారంతో వచ్చి స్వాగతం చెప్పారు. నన్ను

వెంటనే రాజుగారి అనుమతి తీసుకుని,
బ్లెఫుస్కూ రాజ్యపు ఓడలై నౌకలు నా వెంట




తిరిగి ఇలా ఇల్లు చేరినా ఊరికే వుండవు. లిల్లిపుట్ నుండి తిరిగి వచ్చిన రెండు నెలలకే మళ్లీ ఓడ ఎక్కాను. దాని పేరు 'అడ్వెంచర్.'



సూరతుకు బయలుదేరాము. కొన్నిరోజులు ప్రయాణం బాగానే సాగినా హఠాత్తుగా తుఫాను విరుచుకు పడింది.



తుఫాను తగ్గేసరికి కొత్త ఇబ్బంది వచ్చింది. ఓడలో మంచి నీళ్లయిపోయాయి. కాని అంతలోనే భూమి కనబడింది.



మేము పన్నెండుగురము కలిసి ఒక పడవలో ఒడ్డుకి వెళ్లాము. అది ఒక పెద్దద్వీపం. అందరం తలో దారినా నీటికై వెతుకుతూ వెళ్లాము.



ఎంత వెతికినా నీటిజాడ కనిపించక విసుగేసి పడవవేపు మళ్లేసరికి నాతోటి నావికులందరూ



'నాకోసం ఆగండోయ్' అని కేక వెయ్యబోయాను. కాని అక్కడ భయంకరమైన



నా కేకలు వినబడి నేను కనబడివుంటాను. ఆ కూలీ నన్ను పట్టుకుని తన కామందు దగ్గరకు పరిగెత్తాడు.



కామందు ఓ గడ్డిపరకతో నన్ను పైకెత్తి, వింత పురుగును చూసినట్టు చూశాడు. నాకు తెలిసిన అన్నిభాషల్లో నేనూ మనిషినేనని అరిచాను.



అతనికేం అర్థమైనట్లు లేదు. నన్ను కిందికి మెల్లిగా దించాడు. నేను ముందుకూ వెనక్కూ నడచి నేను పారిపోనని నమ్మకం కలిగించాను.



జేబులోని డబ్బుసంచి కింద ఒంపి బంగారు నాణేలు అప్పజెప్పాను. అతను చెమ్మ్రవాని అద్దినట్టు వేలితో అద్ది తీసి చూసి వదిలేశాడు.



తన అరచేతిని నేలమీద ఆనించి చేతిరుమాలు పరిచి నన్నెక్కమన్నాడు. అరచెయ్యి మంచం



రుమాలు అంచుచుట్టి పదిలంగా ఇంటికి తీసుకువెళ్లి తన భార్యకి చూపాడు. ఆవిడ





30 అడుగుల ఎత్తు బల్లచుట్టూ కామందు కుటుంబం భోజనాల కూర్చున్నారు. ఒకో పళ్లెం 24 అడుగుల వెడల్పుంది

ఇంటావిడ రొట్టెముక్క లిచ్చింది. నా జేబు లోంచి కత్తి పాక్కు తీసి ఆ ముక్కల్ని తరిగి కోసుకు తింటూంటే వాళ్లంతా నవ్వారు.





హఠాత్తుగా కామందు చిన్నకొడుకు నా ఎడం కాలు పట్టుకుని గబుక్కున తల్లకిందులుగా 60 అడుగుల పైకెత్తాడు.

కామందు గబగబా వచ్చి నన్ను కాపాడి కొడు కుని దండించబోయాడు గాని నేను అడ్డు పడ్డాను. ఒక చిన్న జెల్లకాయ కొట్టి వదిలేశాడు.





వెనకాల చిన్న గర్జన వినబడింది. చూస్తే అది వాళ్ల పిల్లి! మన ఎద్దుకి మూడు రెట్లుంది.

భోజనాల తరువాత ఇంటావిడ నన్ను పక్కమీద పడుకోబెట్టి తన రుమాలు దుప్పటిగా కప్పింది.




నేను పడుకున్న ఆ మంచం 8 గజాల ఎత్తు 20 గజాల వెడల్పు వుంది. మెలకువ వచ్చి లేచి చూస్తుండగా రెండువైపులా భయంకరమైన రెండు ఎలుకలు నామీద పడబోతున్నాయి. వెంటనే కత్తి దూసి ఒక ఎలుకని పొడిచి చంపేశా. రెండోది పారిపోయింది. ఎలుక శవం తోక లేక ఏకంగా ఆరడుగులుంది!



ఇంతలో ఇంటావిడ వచ్చి ఎలుకని రక్తాన్నీ చూసి, తన తొమ్మిదేళ్ళ అమ్మాయిని పిలిచి నన్ను జాగ్రత్తగా చూసే బాధ్యత వప్పచెప్పింది.



ఆ అమ్మాయి తన బొమ్మ ఉయ్యాలలో నన్ను వుంచి, వాళ్ళ భాష నేర్పించింది. ఆమె చిన్న పిల్లే కనక నలభై అడుగులే ఎత్తున్నది.



ఓరోజున ఇంటాయన స్నేహితుడు ఒక ముసలి



అతను వృద్ధుక్కని ఇంటాయనని ఓ పక్క



...ంటాయన మర్నాడు నన్నొక పెట్టెలో పెట్టి
...మ్మాయి ఒళ్ళో ఆ పెట్టి వుంచి పక్కవూరి
...తకి బయలుదేరిపోయారు.



ఆ గుర్రం ఒకో అంగలో నలభై అడుగులు దాటే
స్తోంటే నేను బంతిలాగ ఎగిరెగిరి పడసాగాను.
ఆ ఊళ్ళో దిగిన తరువాత....



...యవతవి అద్భుత ప్రదర్శనం!' అంటూ ఊరంతా టముకు వేయించారు. ఒక గదిలో మూడొందల
...డుగుల చదరం వున్న బల్లమీద ప్రదర్శనం ఏర్పాటుచేశారు. నా దాది అడిగిన ప్రశ్నలకి జవాబు
...వ్వటం—కత్తిదూసి ఝళిపించటం—అటూ ఇటూ నడవటం—ఇదీ నేను చెయ్యవలసింది.



...ఖ్యాతి ఊరూరా పాకిపోయింది. డబ్బు బాగా



రోజుకు పన్నెండాటలు ఆడ్తుంటే నేను బాగా





ఒక రోజు రాణీగారి వద్దనుంచి నన్ను తీసుకు రమ్మని కబురు వచ్చింది. యజమాని వెంటనే రాజభవనానికి బయలుదేరాడు.

రాణీగారి చిటికెన వేలు ముద్దు పెట్టుకుని నమస్కారం చెప్పాను. ఆవిడ తనవద్ద వుండి పొమ్మని అడిగింది. నాకు కష్టమే అని చెప్పాను.





యజమానికి వెయ్యి బంగారు నాణాలు ఇచ్చి పంపేశారు. దాదిపిల్ల మాత్రం నాకూడానే వుండాలని షరతు పెట్టాను.

ఆ రైతు డబ్బు ఆశ మూలంగా నన్ను ఎంత అవస్థ పెట్టిందీ వచ్చీ రాని వాళ్ళ భాషలో రాణీగారికి చెప్పుకున్నాను.



నా అంత చిన్న ప్రాణికి కూడా ఇంత జ్ఞానం వున్నందుకు ఆవిడ ఆశ్చర్యపోయి నన్ను రాజుగారికి



...న్ను బాగా పరకాయించి చూసి మరింత ...శ్చర్యపోయాడు. నన్ను జాగ్రత్తగా చూడమని ...దేశించాడు.





...నివాసానికి 16 అడుగుల వెడల్పు 12 అడు...ల ఎత్తు గల ఒక కర్రపెట్టె చేయించారు. ...ందు కుర్చీలూ బల్లలూ అమర్చారు.

రోజూ రాణిగారితో భోజనం చేసి రాజుగారితో కబుర్లు చెప్పేవాణ్ణి. ఆయన మా దేశం గురించి ప్రశ్నించి నా జవాబులు శ్రద్ధగా వినేవారు.



రాణిగారికి నేనంటే చాలా ఇష్టంగా వుండేది.



రాజుగారి కొలువులో ముప్పై అడుగుల పొడు...



దాది నన్ను రోజూ తోటలో ఆడించేది. ఒకనాడు తోటమాలి కుక్కపిల్ల నన్నునోట కరచుకుని తోటంతా పరుగులు తీసింది.



తోటమాలి కుక్కపిల్ల నుంచి నన్ను రక్షించి కంగారుపడుతున్న దాదికి జాగ్రత్తగా అప్ప గించారు.



తోటలో అంతా నవ్వుతూంటే నాకు చిన్నతనంవేసింది. కుక్కపిల్లలే కాదు—ఆఖరికి ఆ దేశంలో మన పిచికలంత చిన్న పిట్టలు నన్ను చిన్న చూపుగానే చూసేవికావు. నన్ను పట్టించుకోకుండా నిర్భ యంగా తిరిగేవి.



ఆ దేశంలో వానా వడగళ్లూ కూడా పెద్ద ఎత్తునే పడేవి. చినుకు వడగళ్ళంతేనా, వడగళ్ళు



అసలు గండం నాకు కోతి వల్లనే దాపురిం చింది. ఒకరోజు నేను నా గదిలో కూర్చుని



తరవాత రాజాగారితో మాట్లాడుతూ ఈ కోతి కాబట్టి భయపడ్డాంగాని మా దేశంలో అయితే కొరతవెయ్యి మని, కత్తిదూసి అభినయిస్తూ చెప్పాము. ఆయన లోలోపల నవ్వుకున్నారు. పై అంతస్థు వారివద్ద మన ప్రతిభ చూపటం పొరపాటని అనిపించింది.



అయినా మా దేశం గొప్పతనం గురించి, రాజ నీతి, ధర్మపాలన, శాంతిరక్షణ, యుద్ధం మొదలగువాటి గురించి వివరంగా చెప్పాను. అన్నీ విని ఆయన తన మంత్రికేసి చూసి నవ్వుతూ, "ఇంతటి అల్పజీవులకి కూడా ఎంతటి అహం



"వీళ్లకి రాజనీతి, సైన్యం పెద్ద చిన్నా కేహాలు వున్నాయట! శాంతి నిలబెట్టడంకోసం యుద్ధం చేస్తార్ట! వీళ్ల చరిత్రంతా యుద్ధాలూ హత్యలూ దగాలూను. ఇంతకన్నా అల్పబుద్ధులూ, అధర్మపరులూ ఈ భూమిమీద మరెక్కడా

# గలివర్ యాత్రలు





ఓరోజు మంగలినడిగి రాజుగారి శిరోజాలు తీసుకుని వాటితో చక్కటి దువ్వెన తయారుచేసుకున్నాను. ఒకొక్క వెంట్రుక మన దువ్వెన్న పళ్ళంత బలంగానూ వుంది.



రాజుగారి గ్రందాలయంలో నేను పుస్తకాలు చదవడానికి ప్రత్యేకమైన ఏర్పాట్లు చేశారు. ఒక్కొ పంక్తి చదవడానికి నిచ్చెన బారంతా నడిచేవాణ్ణి.

రాణిగారి తలవెంట్రుక ఒకటి సంపాదించి దాంతో ఓ కుర్చీ పేము అల్లినట్టు అల్లాను. కాని, ఆవిడమీద గౌరవంకొద్దీ ఆ కుర్చీమీద నేను ఎప్పుడూ కూర్చోలేదు.



మా దేశంలో పియానో వాయించే అనుభవంతో, సాహసించి రాజుగారి పియానోనుకూడా సాధన చేశాను.



ఒకనాడు రాజుగారు సపరివారంగా సముద్రతీరానికి విలాస విహారం బయలుదేరారు. నా ప్రయాణాల గదిలో నన్నెక్కించి దాదికూడా బయలుదేరింది. త్వరలోనే మేము సముద్రతీరం చేరుకున్నాము.





అక్కడ నా పెట్టెని ఓ కుర్రాడికి వప్పగించి దాది రాణిగారి వద్దకు వెళ్ళింది.



చాలాసేపు గడిచింది. దాదికోసం చూసి

—హఠాత్తుగా పెద్ద తుఫాను గాలి వీచినట్టు [illegible]





ఉన్నట్టుండి నా గది దబేలుమని సముద్రంలో పడింది. కట్టుదిట్టంగా కట్టినందువల్ల నీరు మాత్రం లోనికి రాలేదు.

రోజు బావుంటే ఏ ఓడవాళ్లో చూడకపోరా అన్న ఆశతో చొక్కా విప్పి ఓ కొయ్యకి జెండాలా కట్టాను.





పై కప్పు చిల్లులోంచి ఆ జెండాని పైకెత్తి పట్టుకు కూచున్నాను. ఇంతలో నా పెట్టెని ఎవరో లాగుతున్న చప్పుడయింది.

మా దేశపు ఓడవాళ్ళే నా జెండా చూసి నన్ను ఓడలోకి లాగారు. ఏదో నేరానికి శిక్షగా నేను పెట్టెలో వున్నానని వాళ్ళనుకున్నారట.



కావని నా యాత్రా విశేషాలు చెప్పినా నమ్మలేదు. చివరికి చిన్న బంతిప్రమాణమంతున్న రాణిగారి ఉంగరం, దువ్వెన మొదలైనవి చూపించాక నమ్మారు. కొండంత మనుషుల్ని చూసి చూసివున్న నా కళ్లు నాలాటి మనుషుల్ని చూసేసరికి—



—వాళ్ళంతా సలకల్లాగా కనబడసాగారు. నేను చాలా ఎత్తైనట్టు వాళ్ళు లిల్లిపుట్లంత వాళ్ళయినట్టు చూడసాగాను.



అలాగే మాట్లాడినప్పుడు కూడా అలవాటుకొద్దీ గావు కేకలు పెడుతూ ఉండేవాణ్ణి. చాలారోజులదాకా సాటి మనుషులు అలవాటుపడలేదు.



మొత్తానికి ఇలాగయితేనేం భగవంతుని కృపవల్ల సురక్షితంగా ఇల్లు చేరి నా భార్యా పిల్లలను చూసుకో